# దృష్టిదానం

ఇప్పుడు, పూర్వకాలంవలె కాకుండా, బెంగాలీ ఆడపిల్లలనేకమంది కామేష్టముగా ప్రయత్నించి భర్తలను వెతికి తెచ్చుకోవలసి వస్తున్నదట. నేనుకూడా అదేపనిచేశాను. నాకు అందులో దైవసహాయం లభించింది. చిన్నతనంనుంచి ఈశ్వరుణ్ణి పూజించాను, ఇంకా ఎన్నో వ్రతాలు పట్టాను.

నాకు ఎనిమిదేళ్ళు నిండకుండానే వివాహం జరిగింది. ఎంతో మంచిభర్త లభించాడు నాకు. కాని నాపూర్వజన్మపాపం కారణాన ఆయన నాకు పూర్తిగా లభించలేదు. నాకు రెండుకళ్ళూ లేవు. జీవితకాలంలో భర్తను నాకళ్ళతో చూచి ఆనందించే ప్రాప్తిలేకుండా పోయింది.

చిన్నతనంలోనే నాకు అగ్నిపరీక్ష ప్రారంభమయింది. నాకు పద్నాలుగోఏట ఒకపుత్రశిశువు కలిగింది. అప్పుడు వచ్చినరోగానికి నేను చచ్చిబతికాను. కొందరు దుఃఖాలు భరించటానికి జన్మిస్తారు, వాళ్ళకు త్వరగా చావురాదు. వెలుగుతూ వుండవలసిన దీపంలో త్వరగా చమురుతగ్గిపోదు-రాత్రంతా వెలిగి గాని దీపం ఆరదు.

నేను చనిపోలేదు, కాని మానసిక దుఃఖంవల్లనో, శరీర బలహీనతవల్లనో లేక మరింకే కారణంవల్లనో గాని నా రెండుకళ్ళు పాడైపోయాయి.

అప్పుడు నాభర్త డాక్టరుపరీక్షకు చదువుతూ వున్నారు. కొత్తవిద్య చదివే ఉత్సాహంలో తనవిద్యను

ప్రదర్శించే అవకాశం లభించటంవల్ల, ఆయనకు చాలా ఆనందం కల్గింది. నాకళ్ళకు తానేచికిత్సచేయనారంభించారు.

ఆ సంవత్సరమే మాఅన్న బి. ఎల్ పరీక్షకు వెళ్తాడు. నాకళ్ళకు వైద్యం జరుగుతూవుండగా ఒకనాడు అతను మాయింటికి వచ్చాడు. ఇదంతాచూచి 'అయ్యో, ఏమిటిది? కళ్లుపోతాయి, జాగ్రత్త! మంచి డాక్టరుకు చూపించు' అన్నాడు.

'మంచిడాక్టరు వచ్చిమాత్రం ఇంతకంటెకొత్తవైద్యం ఏమిచేస్తాడు. ఎవరు ఇచ్చినా అవేమందులు' అన్నారు నాభర్త.

మా అన్నయ్య కొంచెం కోపగించుకొని 'అయితే నీకూ మీ కాలేజీలో పనిచేసే సర్జనుకూ తేడా ఏమీ లేద న్నమాట!' అన్నాడు.

'నువ్వు చదువుతున్నది. 'లా' పరీక్ష. నీకు వైద్యాన్ని గురించి ఏమి తెలుస్తుంది? నువ్వు పెళ్లిచేసుకొని నీభార్య ఆస్తికోసం దావావేయవలసి వచ్చినప్పుడు నాసలహాప్రకారం నడుచుకుంటూ వంటావా?. అని అడిగారు నాభర్త. రాజూరాజూ దెబ్బలాడుకుంటే మధ్య నలిగిచచ్చేది సేవకులే కదా!

నాభర్త, అన్నయ్యా తగవులాడుతూవుంటే బాధ పడేది నేనేకదా! వివాహంచేసి అన్నయ్యనన్ను నాభర్తకు అప్పగించేశాడు. ఆతరువాత ఆరోగ్యంగావున్నా, రోగం వచ్చినా ఏవిషయంలోనైనా సరే ఏదిచేయవలసి వచ్చినా

ఆభారం వహించేది భర్త. అటువంటప్పుడు ఇందులో మళ్లీ అన్నయ్య జోక్యం ఎందుకూ అని మనస్సులో అనుకున్నాను.

స్వల్పమైన ఈకంటి చికిత్సనుగురించి అన్నయ్యకూ నాభర్తగారికీ అభిప్రాయభేదం వచ్చింది. రోగంవల్ల నాకళ్ళ వెంబడి కారేనీళ్ళు ఆవాళ మరింతఅధికమయాయి. కాని అందుకు కారణం ఏమిటో వారిద్దరిలో ఎవరూ గ్రహించలేక పోయారు.

ఒకనాడు నాభర్త కాలేజీకి వెళ్ళినప్పుడు మధ్యాహ్న సమయంలో అన్నయ్య హఠాత్తుగా ఒక డాక్టర్ని మాఇంటికి తీసుకొనివచ్చాడు. అతను నాకళ్ళను పరీక్షించి 'జాగ్రత్త వహించకపోతే చాలా ప్రమాదం కలుగవచ్చు' అని చెప్పి ఏవో చాలామందులు వ్రాసి ఇచ్చాడు. అన్నయ్య ఆమందులు కొనితెమ్మని బజారుకు మనిషిని పంపాడు.

డాక్టరు వెళ్లిపోయాడు. ఆతరువాత నేను అన్నయ్యను బ్రతిమాలుతూ 'అన్నయ్యా ఆయనవైద్యానికి నువ్వేమీ అడ్డుతగలవద్దు, అదే నాకుమేలు చేసినట్లు' అని అన్నాను.

చిన్నతనంనుంచి అన్నయ్యను చూస్తే నాకు తగని భయం. అతనిముందు ఇన్నిమాటలు మాట్లాడినందుకు నాకే చాలా ఆశ్చర్యం కల్గింది. నాభర్తకు తెలియకుండాఅన్నయ్య చాటుగా వైద్యం చేయించటం వల్ల నాకు చెడుజరుగుతుందే తప్ప మరేమీ ప్రయోజనం వుండదనినాకు తెలుసును.

నేను అంతధైర్యంగా అన్నిమాటలు మాట్లాడటం చూచి అన్నయ్యకు కూడా చాలా ఆశ్చర్యం కల్గింది. కాస్సేపు ఆలోచించి 'సరే, ఇకడాక్టర్ని తీసుకురాను. ఇప్పుడు

తెస్పేమందులు [illegible] నాశీకాదు' అన్నాడు అన్నయ్య.
మందులు రాగానే అవి ఏవిధంగా ఉపయోగించాలో అన్నీ
నాకు చెప్పి మరిచెప్పి అన్నయ్య ఇంటికి వెళ్ళిపోయాడు. నా భర్త
కాలేజీనుంచి తిరిగివచ్చి నాకళ్ళ ఆమందులు, మాది,
డాక్టరు వ్రాసి ఇచ్చిన చీటీ. అన్నీ చుట్ట బెట్టి
కూడా [illegible] పారేశాడు. నా భర్త కోపం
వచ్చి అన్నయ్యతో మాట్లాడటం మానేశాడు.
అంతేగాని కాశీనుంచి వచ్చిన ఉత్సాహంతో నాకళ్ళకు
చికిత్సచేయ ప్రారంభించాడు. [illegible] మందులువారు
తున్నాయి. కళ్ళకు [illegible] పెట్టి పేడ్ పట్టుకొన్నాను.
కళ్ళల్లో రకరకాల ఆకులు, పసర్లు వేసుకొనేదానను. బలాని
కని [illegible] ఆకుపసరు [illegible] తెగితే [illegible] చెడువాసన
వేసేది. 'ఇప్పుడెలావుంది?' అని నా భర్త అడుగుతూవుండే
వారు. 'చాలా బాగావుందిప్పుడు' అని జవాబుచెప్పేదానను.
బాగవుతూవున్నదని నిజంగా నే నాకు విశ్వాసం కుదరాలని
చాలా ప్రయత్నం చేసేదానను. కళ్ళవెంట నీరు అధికంగా
కారుతూవుంటే జబ్బునీరు కారిపోవటమే మంచిది అని అను
కొనేదానను నీరుకారడం తగ్గినప్పుడు రోగం బాగవటం
వల్లనే నీరుకారటం తగ్గిపోతుందని జవాబుచెప్పుకొనేదానను.
కాని క్రమంగా కొంతకాలమయేసరికి బాధ భరించశక్యం
కానంతగా హెచ్చింది. కళ్ళు మసకలుకమ్మాయి. పోటువల్ల
ఏమిచేయటానికీ తోచేదికాదు. అదిచూచి నాభర్తకూడా
భయపడ్డాడు. ఇంతకాలమూ వూరుకొని ఇప్పుడు డాక్టర్ని
ఎలాపిలిపించాలా అని ఆలోచిస్తున్నాడు.

'ఎవరైనా డాక్టర్ని పిలిచి చూపిస్తే పోయేదేముంది!
అన్నయ్యకు కూడా సంతృప్తి కలుగుతుంది' అని అప్పుడు
అన్నాను నేను— 'దీనికోసమని అన్నయ్య అనవసరంగా
కోపం తెచ్చుకొన్నాడు, అందుకు నాకూ కష్టం వేసింది.
పేరుకు ఎవర్నైనా డాక్టర్ని పిలవండి. వైద్యంమాత్రంఎప్పటి
వలె మీరే చేయవచ్చు.'

ఆవిధంగా చేయటం బాగుంటుందని అంగీకరించి
ఆవాళే కంటివైద్య నిపుణుడైన ఒకడాక్టరుగారిని తీసుకువచ్చి
నాకళ్లు పరీక్ష చేయించారు. వారిద్దరికీ జరిగిన సంభాషణ
నేను వినలేకపోయాను. కాని డాక్టరుగారు నాభర్తను చీవాట్లు
పెట్టినట్టు మాత్రం గ్రహించగలిగాను. నాభర్త
ఎదురుజవాబేమీ చెప్పక తలవంచుకొని నిల్చున్నారు.

డాక్టరుగారు వెళ్లిపోయిన తరువాత నేను నాభర్త
చెయ్యి పట్టుకొని 'ఎవర్నైనా దేశీయ వైద్యుణ్ని తీసుకువస్తే
బాగుండేదానికి ఈ బండ తెల్లగాడిదను ఎక్కడినుంచి పట్టు
కొచ్చారు! నాకంటిజబ్బు వాడికేమి అర్థమవుతుంది?' అని
అన్నాను.

'కన్ను ఆపరేషను చెయ్యాల్సి వుంటుందట' అన్నారు
నాభర్త భయపడుతూ.

'ఆపరేషను అవసరమని మొదటే తెలిసికూడా నే
నెక్కడ భయపడతానో అని మీరు నాతో చెప్పారు కాదు—
అంతేనా?' అని అన్నాను కోపం నటిస్తూ. ఆమాటలతో
వారిసిగ్గు మాయమై పోయింది.

'కన్ను ఆపరేషను అంటే మొగవాళ్ళు మాత్రం భయపడరనుకొన్నావా? వాళ్ళల్లోకూడా భయపడేవాళ్ళు చాలామంది వున్నారు' అన్నారు నాభర్త.

'అయితే పురుషుల వీరత్వమంతా ఆడవాళ్ల దగ్గరే నన్నమాట!' అన్నాను ఎగతాళిచేస్తూ.

అందుకు ఆయన సిగ్గుపడుతూ 'అవును, ఆమాట నిజమే. పురుషులకు అంతులేనంత అహంకారం' అనిఅన్నారు.

ఆయనలో వచ్చిన గాంభీర్యం చెదరగొట్టాలని 'స్త్రీ లలో మాత్రం అహంకారం తక్కువా? దానిముందు మీ పురుషుల అహంకారం ఎంత? అందులోకూడా పై చెయ్యి మాదే' అని అన్నాను.

ఈలోపల అన్నయ్య ఒకనాడు మాఇంటికివచ్చాడు. అప్పుడు నేనతనితో 'మీడాక్టరు ఇచ్చినమందులు వాడటం వల్ల కళ్ళు చాలావరకు బాగుపడ్డాయి. కాని ఒకనాడు పొర పాటువల్ల లోపలికి తినవలసినమందు కంట్లో వేసుకొన్నాను. దానివల్ల ఇప్పుడు కళ్లుపోతాయేమోనని అనుమానంగావుంది. ఇప్పుడిక ఆపరేషను చేయాల్సిందేనట' అని చెప్పాను.

అందుకు అన్నయ్యచాలా నొచ్చుకొంటూ 'అమ్మో ఇంకా నీభర్తవైద్యమే సాగుతూవుంటుందనుకొని, కోపంవల్ల నేనిక్కడికి రావటమే మానేశాను' అని అన్నాడు.

'ఆయనకు తెలిస్తే కోపంవస్తుందేమోనని తెలియ నీయకుండా మీ డాక్టరుగారు చెప్పినప్రకారంగానే చికిత్స చేస్తున్నాను.

స్త్రీగా జన్మించినందుకు ఎన్ని అబద్ధాలాడాలి! అన్నయ్యకు కోపం రాకూడదు భర్తగారి మానికిభంగం రాకూడదు. తల్లిగా అడ్డాల్లోని బిడ్డను మరిపించాలి- స్త్రీలకు ఇటువంటి కపటం లేనిదే జరగదు.

కాని ఈకపటంవల్ల నాకు కల్గిన లాభం ఏమంటే, నాదృష్టి పోకముందు మా అన్నయ్యనూ నాభర్తనూ తిరిగి కలపగలిగాను. చాటుగా వైద్యం చేయించటంవల్ల ఇటువంటి చెడు జరిగిందని అన్నయ్య విచారించాడు. మొదటనే అన్నయ్యమాటవిని వైద్యం చేయిస్తే చాలా బాగుండేదని నాభర్త విచారించాడు. ఈవిధంగా పశ్చాత్తాప పడుతున్న హృదయాలతో మనస్సుల్లో ఒకరి నొకరు క్షమాపణ కోరుకొంటున్న వారిద్దరిలోనూ ఐక్యభావం ఏర్పడింది. అప్పటి నుండి నాభర్త అన్నయ్య సలహాలేకుండా ఏపనీ చేసేవారు కారు. అన్నయ్యకూడా ప్రతివిషయం లోనూ నాభర్తసలహా ననుసరించే నడుచుకొనేవాడు.

ఆ ఇద్దరి సలహా ప్రకారం ఒకనాడు ఇంగ్లీషుసర్జన్ ఒకడువచ్చి నాకన్ను ఆపరేషన్ చేశాడు. ఆకంటిలోని శక్తి కాస్తా పోయింది. ఆపరేషను జరిగిన తరువాత అంతకుముందున్న స్వల్పదృష్టికూడా హఠాత్తుగా ఎగిరిపోయింది. అతదుపరి రెండోకంటి దృష్టికూడా క్రమంగా క్షీణించి చివరకు ఆకన్నుకూడా పోయింది. నా వివాహంనాడు చిన్నతనంలో మొట్టమొదట వధూవరులము ఒకరొన్నొకరు చూచుకొన్న నాటి చందనంపూసిన నాభర్త సుకుమారముఖం నాకళ్ళ

ముందు కన్పించింది. శాశ్వతకాలమూ నాకు కనపడగల్గింది చిన్నప్పుడు నేను చూచిన ఆస్వరూపమే.

ఒకనాడు నాభర్త నామంచం దగ్గరకువచ్చి 'నేనిక వట్టి గొప్పలుచెప్పను-నీకళ్లు పోగొట్టింది నేనే' అనిఅన్నారు.

ఆయనకంఠస్వరంలో వ్యక్తమయే దుఃఖాన్ని గ్రహించి వారిచేతిని నాచేతుల్లోకి తీసుకొని చాలామాటలు చెప్పాను. 'మీరుచేసింది మంచిపనే అంటాను. మీవస్తువును మీరే తీసుకొన్నారు. మీరే ఆలోచించిచూడండి, మరేడాక్టరు చికిత్సవల్లనో నాకళ్లు పోయాయనుకోండి, అంతమాత్రాన నాకు కలిగే ధైర్యం ఏముంది? విధివ్రాత నెవ్వరూ తప్పించ లేరుకదా! ఆ విధంగా వ్రాసిపెట్టి వున్నప్పుడు ఎవరు మాత్రం కాపాడగలరు? నాకళ్లు మీచేతుల్లో పడ్డా యన్న ఆలోచనే ఈ అందత్వంలో నాకు కలిగే సుఖానికి కారణం. పూజకు పుష్పాలు చాలనప్పుడు శ్రీరాములవారు తనకళ్ళను తీసి పూజచేయటానికి సిద్ధపడ్డారు. నేను నాకళ్ళను నాదేవునికి ఇచ్చాను. మీకంటికి ఎప్పుడు ఏదిబాగా కనబ డితే అదినాతో చెప్తూవుండండి. అదే మీకళ్ళు నాకు ఇస్తూవున్నదానం అని దానిని నేను తీసుకొంటూవుంటాను.'

ఇదంతా మాటలతో చెప్పటం నావల్ల అయేపనికాదు. ఇటువంటివన్నీ చెప్పవలసిన మాటలు కావుకూడా. నేనెన్నా ళ్ళనుంచో అనుకొంటూ వున్నమాటలే ఇవి. నానిష్ఠాబలం తగ్గినప్పుడో, దుఃఖం కల్గినప్పుడుగాని, నేనెంత దురదృష్ట వంతురాలను అని అనిపించినప్పుడో లేక నిరాశగావున్నప్పుడో ఈమాటలన్నీ నామనస్సు చేత అనిపించేదానను. ఈభక్తినీ,

ఈ శాంతిని ఆసరాగా చేసుకొని నాదుఃఖాన్నంతటినే మించి పెరిగిపోదామని ప్రయత్నించేదానను. ఆనాళ్ళ, కొంత మాట లద్వారాను, కొంత మాటలులేకుండా కూడా నామనోభా వాన్ని ఆయనకు తెలియచేయగలిగాను. ఆయన అందుకు జవాబుగా, 'కుసుమా, నా అజ్ఞానంవల్ల నీకళ్ళు పోగొట్టాను. ఆపోయిన కళ్ళను నీకుతిరిగి తెచ్చివ్వలేను కాని నాశక్తినంతా వినియోగించి, సాధ్యమైనంతవరకు నీకేవిధమైన కష్టమూ కలగకుండా ఎల్లప్పుడూ నీదగ్గరనే వుంటాను' అనిచెప్పాను.

'అలా జరగటానికి వీల్లేదు. నన్నొక అందుల ఆసుప్తితిగా చేసుకొని ఎప్పుడూ మీరు నా వద్దనే పడివుంటానంటే నేనెంతమాత్రమూ అంగీకరించను. మీరు మళ్ళీ వివాహం చేసుకు తీరాలి.'

మళ్ళీ వివాహమాడటం అంత ఎందుకు అవసరమని నేననుకొంటున్నానో వివరించాలనుకొన్నాను, కాని గొంతులో ఏదో అడ్డంపడినట్లు మాటపెగల్లేదు. గొంతుసవరించు కొని నేనుచెప్పబోయేసరికి నాభర్త చాలా ఉద్రేకంతో ఇలా అన్నారు—నేను మూర్ఖుడనే, అహంకారినే, అంత మాత్రాన నాకు హృదయమనేది లేదనిమాత్రం అనుకోకు. నాచేతులతో నీకళ్ళుపోగొట్టి, ఇప్పుడు నువ్వు గుడ్డిదానవని నిన్ను వదలివేసి వేరొక వివాహమే చేసుకొంటే బ్రహ్మ హత్య, పితృహత్య చేసినట్టేనని మాకులదేవత గోపీనాథుని ఎదుట ప్రమాణం చేస్తున్నాను.'

నాభర్త అంతకఠోర ప్రమాణం చేయకుండా చేసే వాననే కాని ఎడతెగని నాఅశ్రుప్రవాహంవల్ల, గొంతు

లోనుంచి మాటే రాలేదు. ఆ చివర మాటలు వినగానే మితిలేని ఆనందం కల్గి తలగడాలో ముఖం పెట్టుకొని ఏడ్చేశాను. బాధ పడే తన బాధను కౌగలించుకొని కూర్చున్నట్లు నేను గుడ్డిదాన నయినప్పటికీ ఆయన నన్ను విడిచిపెట్టకుండా తన కడుపులో పెట్టుకొంటారట! ఆశాతీతమైన అదృష్టం ఇది, అయినా మానవుల స్వార్థానికి అంతెక్కడ!

నాఏడుపు తగ్గగానే ఆయన ముఖాన్ని నాగుండెమీద పెట్టుకొని 'అంతఘోరశపథం ఎందుకు చేశావు?' అని అడిగాను- 'నీసుఖం కోసమే నేను నిన్ను మళ్ళీ పెళ్ళాడమన్నాను. సవతిద్వారానైనా నాకోర్కె తీర్చుకోవాలని నాఆశ- గుడ్డిదాననైన నేను నీకు చేయలేని సేవఅంతా సవతితో చేయించాలని నాకోర్కె.'

'దాసీది సేవచేస్తుంది. సేవకోసమని దాసీని పెళ్లాడి, దానికి నా దేవితో సమానమైన విలువ ఇవ్వగలనా?' అంటూ ఆయన నాముఖాన్ని పైకెత్తి నొసటన ముద్దుపెట్టుకొన్నారు ఆముద్దుతో నాకు మూడోనేత్రం వచ్చింది. నాలోవున్న దేవికి అభిషేకం జరిగింది. ఇదే మంచి దనుకొన్నాను. గుడ్డి దాననైనాను గనుక నాకిక సంసారంతో పనిలేదు. సంసారం వెలుపలికివెళ్ళి దేవినై నాభర్తకు శుభం కలిగిస్తూవుంటాను. ఇకనుండి నాకు అబద్ధాలతోనూ, నటనతోనూ పనిలేదు. ఇంటిఇల్లాలికి కావల్సిన కపటమూ అల్పబుద్ధీ ఇవాల్టితో వదిలేశాను.

ఆనాడు నాలోపల నాతోనాకే విరోధం కల్గింది. అంతఘోరశపథం చేయటంవల్ల నాభర్త మరోపెళ్ళి చేసు

కోలేరు. ఈఆలోచనవల్ల కలిగిన ఆనందం నన్ను పీడించ సాగింది. ఎన్ని ప్రయత్నాలుచేసినా ఎంతకూ అది నన్ను వదల్లేదు. నాలో కొత్తగా జన్మించిన దేవి నాతో 'నీభర్త ఆశపథంచేసి దానిని భరిస్తూ కూర్చునేకంటే రెండోపెళ్ళి చేసుకోవటమే శ్రేయస్కరమని ఏనాటికైనా నీకే బోధపడ గలదు.' అని అంటున్నది. కాని వేరొకప్రక్కన నాలోవున్న సనాతన స్త్రీ' శపథం చేసినతర్వాత ఇకవివాహం చేసుకో లేడు' అని అంటూవుంది. 'అయినా, నువ్వుఆనందించ తగి నంత కారణమేమీలేదు' అంది దేవి. ఇదేసంభాషణ చాలా సేపు సాగింది. చివరకు నాలోనిదేవి ముఖంముడుచుకొని నోరు మూసుకొని కూర్చుంది భీతిచెందిన నాహృదయంలో అంధకారం ఆవరించింది.

పశ్చాత్తాపం పీడిస్తూవుండటంవల్ల, దాస దాసీలెవర్నీ నాదగ్గరకు రానివ్వకుండా నాపనులన్నీ తానే చేయాలని నాభర్తనిశ్చయించుకొన్నారు మరో ఉపాయమేదీలేక ప్రతి చిన్నపనిలోనూ వారిసహాయంమీద ఆధారపడి వుండటం మొట్టమొదట నాకు సుఖంగానే వుండేది. అందుకు కారణ మేమంటే ఆయన రాత్రింబగళ్లు నాదగ్గరనే వుండేవారు. ఎలాగో కంటితో చూడలేను గనుక ఆయన ఎప్పుడూ నాద గ్గరనే వుండాలనేకోర్కె మరింత ప్రబలంకాజొచ్చింది. కళ్లు బాగున్నరోజుల్లో నాకళ్లు నాభర్తముఖాన్ని తక్కిన ఇంద్రి యాలతో పాటు అనుభవించేవి - ఆకళ్లు పోయినతరువాత కళ్ళవంతు తక్కిన ఇంద్రియాలు పంచుకొన్నాయి. నాభర్త నాకుదూరంగా ఇతరపనిల్లో ఏకాసేపువున్నా, అంతాపోగా

ప్పుకోని కూర్చొంటే నేను నిరాశగా వున్నానేమో అని పించేది. ఇంతకుపూర్వం ఆయన కాలేజినుండి రావటం ఆలస్యమైతే కిటికీలోనుంచి ఎదురు చూస్తూ, కూర్చునేదానను. ఆయన సంచరిస్తూవుండే ప్రపంచాన్ని నా కన్నుల్లో వూహించుకొంటు మనస్సులో ఆయనను బంధించేదానను. దృష్టిలేని నాశరీరం ఇప్పుడు సర్వేంద్రియాలతో నాభర్తను అన్వేషిస్తూవుండి. మా యిద్దరికీ మధ్య వంతెనగా వున్న ఆదృష్టి కూలిపోయింది. ఇప్పుడు మధ్య మిగిలింది గాఢాంధకారం. అందువల్ల ఇప్పుడు ఆయన తన బెడ్డునుంచి నా బెడ్డుమీదికి ఎప్పుడు వస్తారా అని ఎంతో ఆతురతతో ఎదురు చూడాలి. ఒక్కక్షణం ఆయన నన్ను విడిచిపెడ్తే నా అంధశరీరమంతా ఆయనను పట్టుకోవాలని తే[illegible]కలు పడుతూ తిరిగేది.

కాని మరి ఇంత ప్రబలవాంఛ, ఇంత నిస్సహాయత పనికిరాదు. భార్య భారం భర్త ఎలాగో వుండనే వుంటుంది, ఇప్పుడు అదనంగా ఈ అంధత్వం వల్ల ఏర్పడిన భారాన్ని కూడా ఆయనమీద వేయటం నాకు అన్యాయంగా కన్పించింది. నా అంధత్వంయొక్క భారాన్ని నాభర్తమీద వుంచ నని నిశ్చలమైన మనస్సుతో శపథం చేసుకొన్నాను. అనంతమైనా నా అంధత్వం ద్వారా నాభర్తను బంధించి వుంచ కూడదని నేను నిశ్చయించుకొన్నాను.

శబ్దగంధ స్పర్శేంద్రియాల సహాయంతో సామాన్యమైన నాపనులన్నీ స్వయంగా చేసుకోవటం త్వరలో నేనేర్చుకొన్నాను. ఇంటపనులుకొన్ని పు ర్వంకిం లేకూడా చాలా

నేర్పుతో చేయగలిగేదానను. పనిచేయటానికి దృష్టిసహాయ
పడేమాట నిజమేకాని, ఆదృష్టి అపనిమీదనేకాక చుట్టూ
చెదిరిపోతూ వుంటుంది. కనుక మనం అనుకునేంతగా కళ్ళు
సహాయకరము కావని నాకిప్పుడు అర్థమౌతుంది. మరొకటేమి
టంటే కళ్లు పనిచేస్తూ వున్నప్పుడు చెవులు వినవలసినంత
వినవు, నిద్రపోతూవుంటాయి. చంచలమైన నేత్రాలు
లేకుండా పోయిన తరువాత నా సర్వేంద్రియాలూ తమతమ
పనుల్ని నెమ్మదిగా పూర్తిచేసుకొంటున్నాయి.

అప్పటినుండి నాభర్తను నాపనులేవీ చేయనివ్వలేదు.
అంతేగాక ఆయనపనులు కూడా పూర్వంవలె నేనే చేయ
నారంభించాను.

'నాప్రాయశ్చిత్తానికి అడ్డంవస్తావెందుకు?' అనేవా
రాయన.

'మీకు ప్రాయశ్చిత్తం ఎందుకో నే నెరుగనుకాని
ఇదంతా మీమీదవేసి నాపాపభారాన్ని పెంచుకోవటం
నాకెంతమాత్రం ఇష్టంలేదు' అన్నాను నేను.

ఎలాగైతేనేం, కార్యభారాన్నుంచి విడుదలపొంద
గానే 'బ్రతికిపోయాను' అనికొని నిట్టూర్చారాయన. జీవిత
మంతా అంధురాలైన భార్యకు సేవచేస్తూ కూర్చోవటం
భర్తకు తగినపనికాదు.

నాభర్త డాక్టరుపరీక్షలో ఉత్తీర్ణులయారు. ప్రాక్టీసు
కోసమని ఒక పల్లెటూరు [illegible]ళము.

పల్లెటూరికి వచ్చివుండటం మాఅమ్మ ఒడిలోవున్నట్లే
అనిపించిందినాకు. ఎనిమిదేళ్ళ వయస్సులో పల్లెటూరు

వదలి నేను పట్టణానికి వచ్చాను. ఈ పదిసంవత్సరాలలో నా జన్మభూమిని గురించి నామనస్సులో ఏదో అస్పష్టఛాయ మాత్రం మిగిలింది. దృష్టిబాగున్న కాలంలో కలకత్తా నగర దృశ్యాలు చిన్ననాటి స్మృతులను పైకిరాకుండా అణచివుం చేవి. కలకత్తా నగరదృశ్యాలు కేవలం మన కళ్ళను మురిపిం చగలవు; వాటిలో ఏదీ మన హృదయాల్లో శాశ్వతంగా వుండదగినది లేదని దృష్టిపోగానే నేను గ్రహించాను. చీకటిపడగానే ఉదయించిన నక్షత్రకాంతివలె దృష్టిపోగానే చిన్ననాటి ఆ పల్లెటూరు నామనస్సులో ఉదయించి ప్రకా శించింది.

మార్గశిర మాసాంతాన మేము హాసీమ్‌పూరు అనే గ్రామానికి వచ్చాము. కొత్తప్రదేశం, ఎలావుంటుందో ఏమిటో నా కేమీ తెలియదు. కాని చిన్ననాటి ఆవాసన, ఆ భావాలు నాసమస్తశరీరాన్ని ఆవరించాయి. దున్నిన పొలాల మీద మంచుకురిసింది, వాటిమీదుగా ఉదయం చల్లనిగాలి వీచేది. పెసర. ఆవాల చేలనుంచి వచ్చే కోమల గంధంతో ఆకాశం నిండిపోయేది. పశులకాపరుల పాటలు గతుకులరోడ్డుమీద పోతున్న ఎద్దుల బండ్ల శబ్దాలు – ఇవి విన్నప్పుడు మనస్సు పులకరించేది. నాజీవితం ఆరంభమైన నాటి మధురస్మృతులు, వర్ణనాతీత మైన అప్పటి మధురశబ్దాలూ, సుగంధమూ, మళ్లీ ఇప్పుడు నేను సాక్షాత్తు అనుభవిస్తూ వున్నట్లే అనిపించింది – ఇదంతా భ్రమఅని నాఅంధనేత్రాలు చెప్పలేకపోయాయి. మళ్ళీ తిరిగి నాచిన్ననాటి రోజుల్లోకి తిరిగి వచ్చానేకాని మాఅమ్మ

మాత్రం నాకు తిరిగి లభించలేదు. అమ్మమ్మ తన గుబురు జుట్టును విరబోసుకొని ఆరబెట్టుకుంటూ దొడ్లో ఒడియాలు పెట్టే దృశ్యం నాకంటికిస్పష్టంగా కన్పిస్తోంది. కాని అమ్మమ్మ పాడే వృద్ధసన్యాసి భజనపాటమాత్రం వినబడటంలేదు. దూరాన ఎక్కడినుంచో 'అంబా' అనేశబ్దం విన్పించినప్పుడు మాఅమ్మ దీపంపట్టుకొని గోశాలకువెళ్ళేదని గుర్తొచ్చేది. మాగోశాలనుంచి తవుడువాసనా, గడ్డికాలినవాసన వచ్చేది. చెరువుగట్టుమీదవున్న విద్యాలంకార్‌గారి గుడిలోనుంచి జేగంటలు వినవచ్చేవి. చిన్ననాటి స్మృతులలోని పదార్థమంతా హరించిపోయి వాటి తాలూకు సుగంధము, రసాంశమూ మాత్రంచుట్టూ పేరుకుపోయిందనిపించేది నాకు.

చిన్నతనంలో నేను నోచిన నోములు, పూజల సంగతి ఇప్పుడు గుర్తొచ్చింది. కలకత్తా నగరానికి రాగానే కొత్త కొత్త మనుషుల రాకపోకలు, అక్కడిసందడి వల్లా మనుష్యులబుద్ధి కొంతవరకు మారిపోతుందని అంగీకరించాల్సిందే. మన మాటల్లోనూ, పనుల్లోనూ భక్తి శ్రద్ధల్లో సైతం వుండే నిర్మలమైన సరళత్వం కొంత తగ్గిపోతుంది.

ఈమధ్య జరిగిన మరొకసంగతి ఇప్పుడిప్పుడే గుర్తొచ్చింది. నాకళ్ళు పోయాయనే సంగతివిని నాబాల్య స్నేహితురాలొకావె నన్నుచూద్దామని కలకత్తాలో మాయింటికి వచ్చింది.

'ఇదుగో చూడు కుమూ! నీకు కోపం రాదా, నీభర్త వంటి భర్త నాకేవుంటే అతనిముఖంకూడా చూడనుసుమా' అనిఅంది ఆ స్నేహితురాలు.

'మాంచటమనేది [illegible] గోతేను, అందుకు నాకన్నా ఏనాడే నాకోసం పైగా భర్తమీదకూడా కోపం ఎందుకే?' అన్నాను నేను. జబ్బు రాగానే నా భర్త మంచి డాక్టరుకు చూపించలేదని నా స్నేహితురాలు లావణ్యకు కోపం వచ్చింది. నాకుకూడా కోపం తెప్పించాలని చూచింది. కాని సంసారంలో కోరినవి కొన్ని, కోరనివి కొన్ని, మనకు తెలిసినవి కొన్ని, తెలియనివి కొన్ని అనేకరకాల సుఖదుఃఖాలు వస్తూవుంటాయి. వాటినన్నింటినీ భక్తి శ్రద్ధలతో సహించివుండటం వల్లనే మనమనస్సులకు శాంతి కలుగుతుందనీ, అలా కాకపోతే కోపతాపాలతోనూ, తగాదాలతోనూ జీవితం దుర్భరమై పోతుందని లావణ్యకు తెలియజెప్పాను. గుడ్డిదానవైపోయావనే దుఃఖం వుండనేవుంది అదిచాలక భర్తమీద కోపగించుకొని ఆదుఃఖాన్ని మరింత పెంచుకోమంటావా అని అడిగాను. అటువంటి మనస్సు కుళ్ళిన కబుర్లు నానోటివెంట రావటం చూచి కోపంతో లావణ్య వెళ్ళిపోయింది. ఏది ఏమైనప్పటికీ లావణ్య మాటల్లో కొంచెం విషంవుంది. అది నిష్ప్రయోజనం కాలేదు ఆమాటల్లోవున్న చిన్నచిన్న నిప్పురవ్వలు రెండు నామనస్సులో వుండిపోయాయి. వాటిని కాలరాసి ఆర్పేశాను. ఆగాయంమాత్రం పోలేదు. 'కలకత్తాలో జరిగిన ఘటనవల్ల మనుష్యులకు అనాగరికత, పశుత్వత కలిగి మనస్సులు కఠినంగా మారిపోతాయి' అని అందుకే నేనన్నది.

పల్లెటూరికి వచ్చినప్పుడు శివపూజకు పువ్వులు వచ్చాయి. ఆ పూలవాసనతోపాటు నా హృదయంలో మళ్ళీ ఆ చిన్ననాటి

ఆశ, భక్తి కలిగాయి. నాహృదయమూ, నాసంసారమూ నాదైవంతో నిండిపోయాయి భక్తితో తలవంచి 'పరమేశ్వరా, నాకళ్లుపోయినా నావాడవు నీవున్నావు' అనేదానను.

అయ్యో, ఎంతపొరపాటు అన్నాను! 'నావాడవు నీవున్నావు' అన్నానే, అది అహంకార పూరితమైన మాట. 'నీదాననైన నేనున్నాను' అని కదా అనవలసింది! నాకున్న అధికారం అదేకదా! ఏనాటికైనా ఈశ్వరుడు గొంతుపట్టి నాచేత ఆమాట అనిపిస్తాడు. నాకున్నసమస్తమూపోవచ్చును కాని నేనుమాత్రం మిగిలివుంటాను, ఎవరి మీదానాకు అధికారం లేదు. ఆ అధికారం నామీద నాకేకదా!

కొంతకాలం వరకు చాలా సుఖంగానేగడచిపోయింది. వైద్యంలో నాభర్తకు మంచిపేరు వచ్చింది, దానితోపాటు డబ్బుకూడా బాగా వచ్చింది.

కాని, ఈడబ్బు అనే వస్తువు చాలాచెడ్డది, అదిమనస్సునుక్రిందికి తోసేసి తానుపైన కూర్చునిరాజ్యంచేస్తుంది. మనస్సు పరిపాలించినంతకాలమూ అదితన సుఖాన్ని తానే సృష్టించుకొంటుంది. కాని సుఖసంచయభారం డబ్బుచేతికి అందగానే, మనస్సు చేయాల్సిన పనేమీ వుండదిక. సుఖాన్ని సృష్టించుకొనే చోటులో డబ్బు పీఠంవేసుకొని నానారకాల వస్తుసముదాయాన్ని పోగుచేస్తూ వుంటుంది. సుఖానికి బదులుగా అప్పుడిక మనకు ఆవస్తుసముదాయమే లభిస్తుంది. సంపాదన పెరిగినకొద్దీ నాభర్త స్థితికూడా గొప్పదవసాగింది. దానితో ఆయన బుద్ధిమారి పోనారంభించింది. నాకీఅభిప్రాయం దేనివల్లకలిగిందోమాత్రం నేనుస్పష్టంగాచెప్ప

లేను- గుడ్డివాళ్ళకు గ్రాహ్యశక్తి ఎక్కువగావుంటుందంటారు, ఈఅనుభవం కలగటానికి కారణం అదీకావచ్చును, లేదా మరేదైనా ఇంకొకటికావచ్చును. ధర్మము, అధర్మము, న్యాయము, అన్యాయము వీటినిగురించి యవ్వనప్రథమ పాదంలో నాభర్తకు మంచి విచక్షణవుండేది. ఏకాస్త అన్యాయంగానీ, అధర్మంగానీ చూచేసరికి చాలా మనోవేదన కలిగేదాయనకు. ఆయనలోవున్న ఆశక్తి క్రమంగా క్షీణిస్తూ వచ్చింది. 'నేను డాక్టర్ చదవటం ధనార్జనకోసంకాదు, దీని ద్వారా అనేకమంది నిరుపేదలకు సహాయం చేయవచ్చు' అని ఒకనాడు ఆయన నాతో అన్నమాట ఇంకా నాహృదయంలోనుంచి మాసిపోలేదు. నిరుపేదల ఇళ్ళకు రోగుల్ని చూచుటకువెళ్లి దక్షిణచేతిలోపడనిదే రోగినాడిచూడని డాక్టర్లనుగురించి చెప్పేటప్పుడు పరమఅసహ్యంకల్గి ఆయన నోటివెంట మాటవచ్చేదికాదు. ఆకాలం గతించిపోయినట్లే కన్పిస్తుందిప్పుడు. ఒకనాడు నిరుపేదరాలైన ఒకతల్లి నాభర్త కాళ్ళుపట్టుకొని తనఏకైక పుత్రుని ప్రాణం కాపాడమని వేడుకొంది. ఆయన ఆమెమొర విన్పించుకోలేదు, అప్పుడునేను వెళ్ళి బ్రతిమాల్గాను. నామాట కాదనలేక వెళ్ళారేకాని మనస్ఫూర్తిగా వెళ్ళి వైద్యంచేయలేదు మాకుఇంత డబ్బులేని రోజుల్లో అన్యాయంగా డబ్బు సంపాదించటం అంటే నాభర్త ఎంత అసహ్యించుకొనేవారో నాకు బాగా గుర్తు. మావారిపేర బ్యాంకులో బాగాడబ్బు నిల్వవున్న రోజులలో ఒకనాడు ఒకలక్షాధికారి మేనేజరు వచ్చి ఆయనతో రెండు రోజులపాటు ఏవోరహస్యంగా మాట్లాడాడు. ఆవిషయ

మేమిటో నాకు తెలియదు. అమెగ్నాడు ఆయన నాదగ్గర ఎంతో ఉల్లాసంగా అనేక సంగతులు మాట్లాడారు. ఆమేనే జరుతో మాట్లాడిన దేమిటో ఒక్కమాటకూడా చెప్పలేదు. కాని ఈమధ్యను నామనస్సుకు కల్గిన స్పర్శజ్ఞానంవల్ల ఆయన దేహాని కేదో కళంకం అంటుకొన్నదని గ్రహించగలిగాను. శత్రువుమూకచేత కూలద్రోయబడిన మనిషి తిరిగిలేచి పట్టుదలతో పనిచేసి తనపూర్వస్థితిని పొందగల్గుతాడు. కాని ధనార్జన, పై ఆడంబరము పెరిగిపోతున్న కొద్దీ కోపలవున్న మనస్సు క్రమక్రమంగా కఠినమై, నిర్దయ స్వార్థమూ జీర్ణించిపోయినమనిషి తిరిగి ఉత్తముడు కాగలిగే మార్గం ఎంత ప్రయత్నించినా నాకుతోచలేదు, అంధత్వం వల్ల మాఇద్దరికీ కలిగిన ఎడబాటు నాకు ఎడబాటుగా కన్పించదు, మామనస్సులకు కలిగిన ఎడబాటు నిజమైన ఎడబాటు! నాకు దుఃఖం కల్గించే విషయాలు ఆయనలో ఏమాత్రం చలనం కలిగించేవి కావు. ఆయన ఆనందించే విషయాలు నాకేమీ వుత్సాహంగా వుండేవికావు. అనగా మనోభావాల ననుసరించి చూచినప్పుడు నేనుండే చోట ఆయనవుండరు. ఆయన వున్నచోట నేనుండను. నాకుదృష్టిలేదు, వెలుగులేనిఅంతర్ప్రదేశంలో ఇప్పటికీ చిన్ననాటి నిర్మలప్రేమ, అమితభక్తి శ్రద్ధలతో పుష్పాంజలి ఘటించి నాహృదయంలో వున్న చిన్ననాటి దేవాలయంలో కూర్చొని వున్నాను. ఆపుష్పాల మీంది మంచుబిందువులు ఇప్పటికీ ఇంకిపోలేదు. కాని ఆచల్లని ప్రదేశాన్ని విడిచిపెట్టి నాభర్త డబ్బువెంటపడి ఏమరుభూమిలో మాయమైనారో, మరినాకు ఆయన లభించలేదు.

ఏసుఖసంపదలు జీవితంలో అన్నిటికంటే విలువైనవని నేను విశ్వసిస్తూ వున్నానో వాటినిదూరంనుంచిచూచి ఇప్పుడాయన ఎగతాళిగా నవ్వుతున్నారు. ఇటువంటి ఎడబాటు పూర్వం లేదు. మేమిద్దరమూ చిన్నతనంలో ఒకేమార్గానబయలుదేరిన యాత్రికులము. ఇద్దరమూ మధ్యదారిలో ఎక్కడ విడిపోయామో ఆయనకూ తెలియదు, నాకూ తెలియదు. ఇప్పుడిక ఆయనకు నాపిలుపుకూడా విన్పించదు.

దృష్టిలేకపోయినందువల్ల సర్వసామాన్యమైన వాటిని కూడా పెద్దచేసి ఆలోచిస్తూ కూర్చున్నానా అని నాకు అనిపిస్తూ వుండేది. దృష్టివుంటే అన్నీ ఉన్నదున్నట్లుగా కన్పించేవేమో!

ఆనాటి ఉదయం ఆయన ఈవిషయమే నాకు తెలియచెప్పబోతూ వుండగా ఒక మహమ్మదీయ ముసలివాడు తన మనమరాలికి కలరా తగిలిందని పరుగెత్తుకొచ్చాడు. 'నేను నిరుపేదను బాబూ, దేవుడునీకు మేలుచేస్తాడు' అంటూ నాభర్తకాళ్లు పట్టుకొని ప్రాధేయపడ్డాడు. 'దేవుడు చేస్తాడంటే నాకు గడవదు. నువ్వు చేసేదేమిటో చెప్పు' అన్నారు నాభర్త. ఆమాటలు విన్నప్పుడు దృష్టిపోవడంతో పాటు అభగవంతుడు నన్ను చెవిటిదానిగా ఎందుకు చేయలేదా అని విచారించాను. ఆముసలివాడు బాధగా నిట్టూర్చి 'అయ్యో భగవంతుడా!' అనుకొంటూ బయటికి నడిచాడు. దాసీద్వారా ఆముసలివాడిని వెనకగుమ్మం వద్దకు పిలిపించి 'ఈ నాల్గురూపాయలు తీసుకువెళ్ళి హరీశ్ డాక్టరుగారితో వైద్యం చేయించుకో, నాభర్తను దీవించు' అని చెప్పాను.

ఆవాళ నాకు అన్నం సహించలేదు. ఆయన మధ్యాహ్నం నిద్రమేల్కొని 'విచారంగా వున్నావెందుకు?' అని అడిగారు. ఎప్పటి అలవాటుప్రకారం 'ఏమీలేదు' అని అనబోయాను. కాని నటించాల్సిన కాలం గతించిపోయింది. మనస్సులో వున్నదేదో స్పష్టంగా చెప్పటమే మంచిదని నిశ్చయించుకొన్నాను— 'కొంతకాలంగా మీతో చెప్పాలనుకొని, ఏమి చెప్పాలో నిశ్చయించుకోలేక వూరుకుంటున్నాను. నామనస్సులోని భావాన్ని స్పష్టంగా చెప్పగలనో లేదో గాని ఆవిషయం మీకూ తెలుసు - మన దాంపత్య జీవితం ప్రారంభమైనప్పుడు మనిద్దరి మనస్సులూ ఒకటిగా వుండేవి. కాని క్రమక్రమంగా వాటికి ఎడబాటు కల్గింది' అని అన్నాను నేను. ఆమాటకు ఆయన నవ్వుతూ 'మార్పే సంసార ధర్మం' అని అన్నారు.

'రూపాయలు అణాలు, రూపంయౌవనం - వీటివిషయాలలో మార్పు వుంటుందినిజమే, కాని ప్రపంచంలో మార్పేమీ లేకుండా చిరస్థాయిగా వుండే వస్తువేదీలేదా?' అని అడిగాను నేను.

'ఇదిగో చూడు, అదిలేదు, ఇదిలేదు అని ఏడ్చే భార్యల నెందరినో చూచాను. భర్త సంపాదించటం లేదని కొందరి విచారం, భర్తలు తమను ప్రేమించటం లేదని మరి కొందరు వాపోతారు, నీకు అటువంటి బాధలేవీలేవు. అందుకని తీరిగ్గా లేనిపోని దుఃఖాలన్నీ తెచ్చిపెట్టుకొని బాధపడుతూ వుంటావు' అని అన్నారాయన. గుడ్డితనం నా మనస్సుకేదో అంజనం రాసి అనుదినమూ మారిపోతూ వుండే

ఈప్రపంచం అవతలికి నన్ను తీసుకుపోయి కూర్చోబెట్టింది అనీ, నేను అందరి భార్యలమాదిరి కాననీ, ఆయన నన్ను ఎన్నడూ అర్థంచేసుకోలేరనీ అప్పుడు నేను గ్రహించుకొన్నాను.

నాభర్తగారి మేనత్త ఒకనాడు మేనల్లుడిని చూడాలని మాయింటికి వచ్చింది. ఇద్దరమూ ఆమెకు నమస్కరించి పాదధూళి తీసుకొన్నాము. వెంటనే వారిమేనత్త 'అయ్యో ఇదేమిటే అమ్మాయీ! కళ్లుపోవటం నీదురదృష్టమే. మా అవినాశ్‌ను గుడ్డిపెళ్ళాంతో కాపురం ఎలాచేయమన్నావే, వాడికి 'మళ్ళీపెళ్లి చేయాలిగాని' అని అంది?

'చాలా మంచిమాట అన్నావు, నువ్వెక్కడైనా ఒక మంచి సంబంధం కుదిర్చిపెట్టరాదూ?' అని నాభర్త హేళనగా జవాబుచెప్పివుంటే ఆ ఒక్కమాటతో అంతాపరిష్కారమై పోయేది. కాని ఆయన అలాగు జవాబుచెప్పలేదు. 'అదేమిమాట అత్తా' అన్నారు మాటలు దొరకనట్లు తడబడుతూ.

'అమ్మయీ, నామాటలో తప్పేముందో నువ్వే చెప్పు' అని అంది అత్త.

'మా బాగా అడిగావు అత్తా, ఎవరిగొంతుకోయాలనుకుంటారో వారినే సలహా అడుగుతారా?' అన్నాను నేను.

'అవును, ఆమాటా నిజమే. అయితే అవినాశ్ పద, ఆవిషయం మనిద్దరమూ ఆలోచిద్దాం. ఇదుగో అమ్మాయి, ఒకమాటమాత్రం మర్చిపోకు - ఎందరు సవతులు వస్తే ఇంటి అందగౌరవం ఎక్కువవుతుంది. మా అవినాశ్ వైద్యవృత్తి ప్రారంభించాడు గాని ఇంతగొప్ప వంశమైనందుకు

పెళ్ళిళ్లుచేసుకోవటం ప్రారంభించి వుంటే ఇంతకంటె ఎంతో డబ్బు సంపాదించేవాడు. డాక్టరు చేతిలో పడగానే రోగి చనిపోతాడు. రోగి చనిపోతే డబ్బు రాదుకదా! కాని అనేక మంది భార్యలువున్న గొప్పకుటుంబీకునికి జీవించినంతకాలం ఏదో ఒక భార్యద్వారా డబ్బువస్తూనే వుంటుంది.'

మరినాల్గు రోజులు గడిచిపోయాయి. ఒకనాడు ఆయన నాముందరనే మేనత్తతో 'అత్తా ఎప్పుడూ కుముదు తనదానిలా కనిపెట్టుకొని వుండగలఅమ్మాయి నీఎరుకలో ఎవరైనా వుంటే చూడు. పాపం, కళ్లు కన్పించవు, ఎవరైనా దగ్గరతోడుగా వుంటూ వుంటే నేను నిశ్చింతగావుంటాను' అని అన్నారు. నాకళ్లుపోయిన మొదటి రోజుల్లో ఈమాట అనివుంటే నాకు అంతబాధ అనిపించేదికాదు. ఇప్పుడు అలవాటయి పోవడంవల్ల నాపనులకు ఏమీ ఇబ్బంది కలగటం లేదు. అయినా నేనేమీ మాట్లాడకుండా వూరుకున్నాను. 'ఎందుకు వెతకరు? మామరిదికూతురు వుంది – అందానికి అందం, తెలివికి తెలివీ వున్నపిల్ల. నీవంటి గొప్పకుటుంబీకుడు దొరికితే తప్పక వివాహానికి అంగీకరిస్తారు' అని అంది అత్త.

'నే ననేది పెళ్ళిమాటకాదు' అన్నారాయన తడబడుతూ.

'లేకపోతే అదెలా సాధ్యపడుతుంది? మంచి ఇంటిపిల్లలెవరైనా ఏమీలేకుండా నీఇంటికి వచ్చి ఎలావుంటారు?' అంది అత్త ఆశ్చర్యపడుతూ. ఆమె చెప్పినది సబబుగానే వుంది; అందుకు నాభర్త ఏమీ జవాబు చెప్పలేదు.

నా అంధనేత్రాల అనంతమైన అంధకారంలో ఒంటరిగా నిల్చొని 'పరమేశ్వరా, నా భర్తను కాపాడు' అని చేతులెత్తి ప్రార్థించాను.

ఇది జరిగి నాల్గురోజులయింది. ఒకనాడు పూజముగించుకొని నేను బయటకు వస్తూవుండగా అత్త నావద్దకువచ్చింది.' ఇదుగో, మామరది కూతురు అని చెప్పానే, ఆఅమ్మాయి హేమాంగిని ఇవాళే వచ్చింది' అని నాతో చెప్పి' హేమా, అక్కకు నమస్కరించు తల్లీ' అని అంది.

అప్పుడు అకస్మాత్తుగా నా భర్త అక్కడికి వచ్చి కొత్త అమ్మాయి ఎవరో కన్పించేసరికి, వెళ్ళిపోతున్నట్లుగా వెళ్ళిపోయారు.

ఆయన వెళ్ళిపోవటంచూచి 'పారిపోతున్నా వెక్కడికి!' అని అంది అత్త వెనకనుంచి.

'ఆ అమ్మాయి ఎవరుఅత్తా!' అని అడిగారాయన. తన మరదికూతురు హేమాంగిని ఈ మేనని అత్త చెప్పింది. ఆయన అనవసరమైన ఆశ్చర్యాన్ని కనబరుస్తూ ఆఅమ్మాయి ఎప్పుడు వచ్చింది, ఎక్కడినుంచి వచ్చింది అంటూ అనేక ప్రశ్నలడిగారు.

విషయమంతా నాకు స్పష్టంగా బోధపడుతూనేవుంది. అటువంటప్పుడు ఇక ఈనటన, ఈ దాగుడుమూతలు, ఈ అబద్ధాలు ఎందుకు అని మనస్సులో అనుకొన్నాను నేను. 'అధర్మకార్యం ఆచరించ దలిస్తే ఆచరించండి. మీ నిశ్చయం అదే అయినప్పుడు అదిచేస్తేనే గాని మీకు శాంతిలభించదు.

కాని నన్ను మభ్యపెట్టటానికి ఈ నటన ఎందుకు?' అనికూడా అనుకున్నాను.

హేమాంగినిని చెయ్యిపట్టుకొని నాగదిలోకి తీసుకు వెళ్లాను.

చేతితో ఆమెశరీరమంతా తడిమిచూచాను. ఆమె ముఖం చాలాచక్కగా వుంటుందనిపించింది వయస్సు పద్నాలుగు పదిహేనేళ్ళకు మించివుండదు. నేను ఒళ్ళంతా తడిమిచూడటం చూచి అమ్మాయి పకపకనవ్వుతూ 'అదేమిటిఅక్కా, నన్నుపట్టినదయ్యాని వదల గొడుతున్నావా ఏం?' అని అడిగింది.

ఏవిధమైన జంకూలేకుండా ఆ అమ్మాయి అలా అతి సరళంగా నవ్వేసరికి ఇంతవరకు మాయిద్దరిమధ్యను వున్న అంధకార ఛాయ తొలగిపోయింది. కోమలమైన ఆమె ముఖాన్ని మరొకసారి నాచేతితో తడిమి ఆమెను గట్టిగా కౌగలించుకొన్నాను. 'చెల్లీ, నువ్వు నాకంటికి స్పష్టంగా అగపడుతున్నావు' అని అన్నాను ఆమెతో.

'కనబడుతున్నానా?-మాదొడ్లో పాదుల్నివున్న కాయగూరల్ని ఎంతపెరిగిందోనని చూచినట్లు అలా. ఒళ్ళంతా తడిమిచూస్తావెందుకు' అని మళ్ళీ బిగ్గరగా నవ్వేసింది.

నేను అంధురాలననే సంగతి ఆ అమ్మాయికి తెలియదని అర్థమయింది నాకప్పుడు. 'నాకు దృష్టిలేదు చెల్లీ' అని చెప్పాను. అదివిని ఆమెఆశ్చర్యంతో కొద్దిక్షణాలు నా వైపు వింతగా చూచిందనిపించింది. ఆతరువాత కాస్సే

పటికి 'పెద్దమ్మను ఇక్కడికిరమ్మని కబురంపింది అందుకేనా?' అని అడిగింది.

'మీపెద్దమ్మకు నేను కబురుపంపలేదు. ఆమె తనంతట తానే వచ్చింది' అన్నాను నేను.

'అయితే, నీమీదదయతలచి వచ్చిందనుకుంటాను. అయితే ఇక ఇక్కడినుంచి రానంటుందావేం? నాన్న ఇక్కడికి మరి నన్నెందుకు పంపినట్టు?' అంది హేమాంగిని ఆశ్చర్యపడుతూ.

అప్పటివరకు ఆయనతో ఏదో మాట్లాడుతూ వున్న పెద్దమ్మ గదిలోకి వచ్చింది. ఆమె గదిలోకి అడుగుపెట్టానే హేమాంగిని 'పెద్దమ్మా, ఇంటికి మన ప్రయాణం ఎప్పుడు?' అని అడిగింది.

'అయ్యో అదేమిటే! ఒక ప్రక్క ఇంట్లో అడుగు పెట్టావో లేదో అప్పుడే వెళ్ళిపోదాం వెళ్ళిపోదాం, అనేనా? ఇంత చపలచిత్తం నేనెక్కడా చూడలేదమ్మా' అని అంది పెద్దమ్మ.

'నీధోరణిచూడగా నువ్వుఇక్కడినుంచి అంతత్వరలో వచ్చేటట్టు కన్పించటంలేదు. అయినా నీకేం, మేనల్లుడి ఇల్లు, ఇష్టవచ్చినన్నాళ్లువుంటావు, నాకెందుకమ్మా, నేనువెళ్ళిపోతాను' అంటూ నాచెయ్యిపట్టుకొని 'అవునోకాదోనువ్వేచెప్పు అక్కా! ఎంతయినా ఇదిమాయిల్లుకాదుగదా, మరి నేనన్నిరోజులుంటాను?' అని అంది; అందుకు నేనేమీ సమాధానం చెప్పలేదు కాని ఆమెను దగ్గరకు తీసుకొన్నాను. పెద్దమ్మ ఎంతగట్టిదైనప్పటికీ అమ్మాయిని లొంగదీయటం అంత తేలిక

కాదని నాకు అర్థమయింది. పెద్దమ్మ ఏమాత్రం కోపం లేకుండా మంచిమాటలతో ఆమెను దారికి తీసుకురావాలని ప్రయత్నించింది, కాని ఆ అమ్మాయి పెద్దమ్మమాటల్ని వీసమైనా లెక్క చేసేదికాదు. ఆ అమ్మాయి స్వభావమే అంత అన్నట్లు నవ్వబోయి పెద్దమ్మ 'హేమా, స్నానానికి పద' అని అంది హేమాంగిని నావద్దకువచ్చి 'అక్కా మనిద్దరం రేవుకు వెళ్ళి స్నానంచేసివద్దామా?' అని అడిగింది. ఇష్టంలేక పోయినా పెద్దమ్మ ఒప్పుకోక తప్పలేదు. మరీ అధికారం చేస్తే హేమాంగిని మొదటికే వ్యతిరేకిస్తుందనీ, అయినా నాముందర కీచులాడుకోవటం అసహ్యంగా వుంటుందని భయపడి పెద్దమ్మ ఎదురు మాట్లాడలేదు

స్నానానికి చెరువుకు వెళ్తూవున్నాము.

'నీకు పిల్లలు ఎందుకని లేరక్కా?' అని అడిగింది హేమాంగిని దారిలో.

'ఎందుకు లేరో నాకెలా తెలుస్తుంది? ఆభగవంతుడు ఇవ్వలేదు' అన్నానునేను.

'తప్పకుండా నువ్వేవో పాపం చేసివుంటావు' అంది హేమాంగిని.

'అదికూడా ఆభగవంతునికే తెలియాలి' అని అన్నాను నేను.

అప్పుడు హేమాంగిని తాను అన్నమాటకు ఉదాహరణగా 'మాపెద్దమ్మను చూడు, ఆమెమనస్సు నిండా కల్మషమే. అందుకే ఆమెకు పిల్లలులేరు' అని చెప్పింది! సుఖము దుఃఖము, పాపము – పుణ్యము, అగ్రహము – అనుగ్రహము

వీటితత్వం నాకే తెలీయదు, అటువంటప్పుడు ఆఅమ్మాయి
కెలా తెలియచెప్పగల్గుతాను? దీర్ఘంగా నిట్టూర్చి నాలో
నేను 'నీకే తెలియాలి' అనిమాత్రం అనుకొన్నాను. హేమాం
గిని వెంటనే నాకు దగ్గరగా వచ్చి కౌగలించుకొంటూ'
అయ్యో! అదేమిటక్కా.! నేనేమన్నా ఎవరూ పట్టించుకోరు,
అయినా నామాటల్లో ఏముందక్కా!' అనిఅంది.

నాభర్త ప్రాక్టీసుకు రకరకాల ఆటంకాలు ప్రారంభ
మయ్యాయి. మారుగ్రామాల కేసులకు వెళ్ళటమే మాను
కున్నారు దగ్గర్లో ఎక్కడికైనా వెళ్ళినాత్వరత్వరగాపనిముగించు
కొని వెంటనే వచ్చేస్తూవుండేవారు. ఇంతకుపూర్వం బాగా
పనిలో మునిగివున్న రోజుల్లో మధ్యకాస్సేపు అవకాశం దొరి
కితే భోజనంచేయటానికనీ, కాస్సేపునిద్రపోదామనీమాత్రమే
ఇంట్లోకి వచ్చేవారు - కాని ఇప్పుడో - క్షణానికోసారి
అత్తగారు లోనికి రమ్మని కబురుచేస్తూ వుంటుంది, ఆయన
కూడా మాటిమాటికీ అత్తగారిసంగతి విచారించటానికని
లోనికివస్తూ వుండేవారు. 'హేమా, నాతాంబూలంపెట్టి
తెచ్చిపెట్టమ్మా' అని అత్తపిలిచిందంటే ఆయన అత్తగది
లోకి వచ్చారని నేను గ్రహించేదానను. మొట్టమొదట
హేమాంగిని రెండుమూడు రోజులు పెద్దమ్మమాట ప్రకారం
తాంబూలంపెట్టినో, నూనెగిన్నెనో - పెద్దమ్మ ఏదితెమ్మని
పిలిచేదో అదితీసుకొనివెళ్ళి ఇచ్చేది. ఆ తరువాత పెద్దమ్మ
తెమ్మని కేకేసిన వస్తువును తాను తీసుకువెళ్ళక, దాసీదాని
చేతికిచ్చి పంపుతూవుండేది. లోపలినుంచి పెద్దమ్మ 'హేమా,
హేమా!' అని కేకలు పెడుతూవుంటే హేమాంగిని నావద్దనే

కూర్చుని వుండేది. అటుతరువాత ఆమె నాభర్తను గురించి పొరపాటుగానైనా నాముందు ఏమీ అనలేదు.

ఇలావుండగా ఒకనాడు అన్నయ్య నన్ను చూద్దామని వచ్చాడు. అతనికి కూడా కోపం వచ్చిందని నేను గ్రహించాను ఇక్కడ జరుగుతూవున్న నాటకాన్ని అన్నయ్య కంటబడకుండా చేయటం అసాధ్యమని కూడా నాకు తెలుసు. అన్నయ్య న్యాయబుద్ధి చాలా తీక్షణమైనది, చాలా కఠినమైన విచారణ అతనిది. ఎక్కడైనా కాస్తంత అన్యాయం కన్పిస్తేచాలు సహించి వూరుకోలేడు. అన్నయ్య ముందర నాభర్త అపరాధిగా నిలబడటం అంటే నాకే చాలాభయం. సంతోషం తెచ్చిపెట్టుకొని ఏవిషయమూ అన్నయ్యదృష్టిలో పడకుండా చేయాలని వీలైనన్ని విధాల ప్రయత్నించాను. ఏదీకన్పించకుండా వుండాలని ఎంతో హంగామాచేశాను. కాని ఆవిధంగా హంగామా చేయటం నాస్వభావానికి విరుద్ధంకనుక, అన్నయ్య మరింత తేలిగ్గా పోల్చుకోగలిగాడు నిజం తెలిసిపోయింది. ఏదైతేనేం, అన్నయ్య మాయింట్లో ఎక్కువ రోజులు వుండలేక పోయాడు. ఒక ప్రక్క మనస్సులో ఆందోళనగావుండటంవల్ల మరో ప్రక్క నాభర్త మరీ కఠినంగా ప్రవర్తిస్తూవుండటంవల్ల అన్నయ్య తొందరగానే వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయేముందు అన్నయ్య నాతల నిమురుతూ హృదయపూర్వకంగా నన్ను దీవించాడు. అతని చెయ్యి వణుకుతూ వుండటం నేను గమనించక పోలేదు. కన్నీటితో తడిసివున్న నా చెక్కిళ్ళమీద, అన్నయ్య వేడి కన్నీటి చుక్కలు పడ్డాయి.

నాకు బాగా గుర్తున్నది - ఆవాళ సంతజరిగేరోజు. సంత అయిపోగానే అందరూ ఇళ్ళకుతిరిగివస్తున్నారు. దూరం నుంచి గాలివాన వస్తూవున్నట్లుంది. చినుకులకు తడిసిన మట్టి వాసనతోను, చల్లగాలితోనూ ఆకాశమంతా నిండిపోయింది. గాలివేగానికి జట్టులువిడి చెదిరికొట్టుకొని వచ్చినపక్షులు మైదానంలో పడి దీనంగా అరుస్తున్నాయి. నాగదినిండా గాఢాంధకారం. నేను ఒంటరిగా వున్నప్పుడు బట్టలకునిప్పం టుకుంటుందనే భయంవల్ల నాగదిలో దీపంవుంచను. ఆనిర్జన మైన అంధకారంలో గదిలో నేలమీద సాష్టాంగపడి చేతులు జోడించి నాఅనంతఅంగజగత్తుకు తండ్రిఅయినఆపరమేశ్వరుని ప్రార్థించాను-'పితా, నీదయనాకువెల్లడికానంతవరకు, నీవుద్దేశం నేనుఅర్థం చేసుకోలేనంత వరకు, తుఫానులో చిక్కుకొని చుక్కాని గట్టిగాపట్టి పడవను కాపాడ ప్రయత్నంచేసే సరంగువలె, నాశక్తినంతా ప్రయోగించి నాహృదయాన్ని నేనెంత గట్టిగా పట్టుకొన్నప్పటికీ నన్ను నేను కాపాడుకో లేను. ఈవిధంగా నన్నెందుకు పరీక్ష చేస్తున్నావు ప్రభూ నాలోవున్న శక్తి ఎంతగనుక?' అంటూ ఆపరమేశ్వరునితో మొరపెట్టుకొన్నాను. ఇంతా మాట్లాడుతున్నాను, కన్నీరు కూడా కారిపోతూవుంది, తలనుమంచంమీద పెట్టుకొని ఏడు స్తున్నాను. పగటిపూట రకరకాల పనులతో క్షణమైనా తీరికవుండదు, పైగా హేమాంగిని ఎల్లప్పుడూ నన్నంటిపెట్టు కొనే తిరుగుతూ వుంటుంది. నేను ఏడ్చి ఎంతకాలమో అయింది, ఇవాళ ఏడుపు ఆపుకోలేక పోయాను, వెక్కి వెక్కి ఆదేపనిగా ఏడ్వసాగాను. అటువంటి సమయంలోనే ఎవరో

గదిలో వున్నట్లుంది, మంచం కిరకిరలాడింది. మరుక్షణంలో హేమాంగిని నామీద చేయి వేసి నన్ను గట్టిగా కౌగలించుకొని తన చీర చెంగుతో నా కళ్లు తుడిచింది.

ఆమె చీకటిపడకముందు నాగదిలోకి ఎప్పుడువచ్చి మెదలకుండా మంచంమీద పడుకున్నదో కూడా నాకు తెలియదు. నేనేమీ మాట్లాడలేదు, ఆమెకూడా ఏమీ మాట్లాడలేదు. ఇద్దరమూ మౌనంగానే వుండిపోయాము. ఆమె తన చల్లని చేతులతో నాముఖాన్ని నిమిరింది. ఈలోపల ఉరుములతో కుంభవృష్టికురిసి ఆగిపోయింది. అదేమీ నేను గమనించనేలేదు. ఎన్నాళ్ళకెన్నాళ్ళకో నాతాపదగ్ధహృదయం నేడు ప్రేమతోను, శాంతితోను నిండింది.

ఆమరునాడే హేమాంగిని 'ఇదుగో పెద్దమ్మా, నువ్వు రాకపోతే ఇక్కడే వుండు, నేనుమాత్రం రేపు ఎవర్నయినా తోడుతీసుకొని వెళ్ళిపోతాను' అని చెప్పింది.

'ఎవర్నీ తీసుకు వెళ్ళనవసరంలేదు. రేపు నేనుకూడా బయల్దేరుతున్నాను. ఇదుగో చూడు హేమా, మాఅబ్బాయి అవినాశ్ నీకోసమని ఎంతమంచిఉంగరం కొనితెచ్చాడో!' అంటూ పెద్దమ్మ హేమాంగిని చేతిలో ఒకవిలువైన ఉంగరాన్ని ఉంచింది. అప్పుడు హేమాంగిని దానినందుకొని' పెద్దమ్మా, నేను ఎంత బాగా గురిచూడగలనో చూడు' అంటూ కిటికీలోనుంచి ఆఉంగరాన్ని ఇంటి వెనుకవున్న చెరువులోకి విసిరేసింది. అదిచూచి పెద్దమ్మ నిర్ఘాంతపోయింది. ఆమెకు ఎంతకోపం వచ్చిందో చెప్పలేము.

అప్పుడు పెద్దమ్మ నాకు దగ్గరగావచ్చి చెయ్యిపట్టు కొని 'అమ్మాయి, ఇదేమీ అవినాశ్‌కు తెలియనీయకు. ఇటువంటి చిన్నతనపు పనులుచూస్తే మనస్సు బాధపెట్టు కొంటాడు. వాడికో ఏమీచెప్పకు - చెపితే ఒట్టే!' అని అంది.

'ఆయనతో ఏమీచెప్పను, మీరు భయపడకండి పెద్దమ్మా' అన్నాను నేను

ఆమరునాడు వెళ్లిపోయేముందు హేమాంగిని నన్ను గట్టిగా కౌగలించుకొని 'అక్కా, నన్ను గుర్తుంచుకుం టావా?' అని అడిగింది.

'గుడ్డిదానను, నేను ఎవర్నీ మర్చిపోలేను చెల్లీ, ఏదీ మర్చిపోను' అంటూ ఆమెను కౌగలించుకొని తలమీద ముద్దుపెట్టుకొన్నాను. నా అశ్రుజలం బొటబొట ఆమె తలమీద పడ్డాయి.

హేమాంగిని వెళ్ళిపోయింది; నా ప్రపంచమంతా నిస్సారమైపోయింది. ఆమె ఇక్కడ వున్నంతకాలమూ ఆమెలో జనిస్తూవుండిన సౌందర్య సౌరభాలు, సంగీతమా ధుర్యాలు నా ప్రాణానికి కొంత శాంతి నిచ్చాయి. ఆమెవల్ల నాజీవితానికి కొంత కోమలత్వము, నవీనత వచ్చింది. ఆమె వెళ్ళిపోగానే ఏది ఎక్కడుందో ఒకసారి చూచుకొందామని చేతులతో తడిమాను, ఇంతలో ఆయనవచ్చి అనవసరమైన ఉత్సాహం కనబరుస్తూ' వీళ్ళు వెళ్ళిపోవటంతో బ్రతికి పోయాం. ఏపనిచేయాలన్నా ఊపిరేఆడ లేదు. ఇప్పుడు శాస్తి తెరిపిన పడ్డాం' అని అన్నారు. ఎంత దుఃఖకరమైన

సంగతి! నాముందర ఇంత చాకచక్యము ఎందుకో! నిజాన్ని చూస్తే నేను భయపడతాననా? లేక కష్టానికి గాబరాపడే దాననా? కళ్ళురెండూ ఆర్పివేసిన నాడే ప్రశాంతమైన మనస్సుతో చిరాంధకారాన్ని అందుకొన్నానని ఆయనకు తెలియదా?

ఇంతకాలమూ నాభర్తకూ నాకూ మధ్య అడ్డుగా వున్నది నా అంధత్వమే, కాని ఇప్పుడొక కొత్త అడ్డంకి ఏర్పడింది. ఆయన పొరపాటుగాకూడా హేమాంగిని పేరు నాముందు అనేవారు కాదు. తన ప్రపంచం నుంచి హేమాంగిని పూర్తిగా దూరమై పోయినట్లుగానూ, ఆమె విషయమే తానెన్నడూ తలవలేదన్నట్లు గానూ నటించేవారు. కాని ఉత్తరాలద్వారా ఆమె సంగతులు తెలుసుకొంటున్నారని నేను గ్రహించగలిగాను. చెరువులోకి కొంచెం వరదనీరు వచ్చిందంటే తప్పక తామర కాడలకు చలనం కలుగుతుంది. అలాగే ఆయన మనస్సు ఉత్సాహంతో పొంగిపోతూ వున్నప్పుడు నాహృదయతాడులు కొంచెం కదిలేవి దానిద్వారానే ఆయనకు అక్కడినుంచి వార్తలు ఎప్పుడు వచ్చిందీ రానిదీ నేను పోల్చుకొనేదానను. నేనుకూడా ఎన్నడూ ఆమెపేరు తలవకపోయేను, కాని నా అంధకార హృదయంలో ఒక్కక్షణకాలం అమనోహరమైన నక్షత్రం ఉదయించి ప్రకాశించింది. కనుక ఆమెసమాచారం తెలుసుకోవాలని నాప్రాణం ఎంతో తపించిపోయేది. కాని ఆయనముందు ఆమెపేరు తలవటానికి నాకు అధికారంలేదని

పించింది. మాయిద్దరికీమధ్య వేదనాపూరితమైన గాథ నిశ్శబ్దం ఒకటి స్థిరంగా పాతుకుపోయివుంది.

వైశాఖమాసం వచ్చింది. ఒకనాడుమా దాసీ నావద్దకు వచ్చి 'బాబుగారు ఎక్కడికి వెళ్తున్నారమ్మా! పడవకు బాగా ముస్తాబుచేస్తున్నారు' అని అడిగింది.

ఏదో ప్రయత్నం జరుగుతూవుందని నాకు తెలుసు. తుపాను రాకముందు అంతా చాలానిశ్చలంగా వుంటుంది. ఆతరువాత ప్రారంభమవుతుంది భయంకరమైన ప్రళయ మేఘాలతో తుపాను! సంహారకుడైన పరమశివుడు నానెత్తిపై పడవేయటానికి ఆపదను పోగుచేస్తున్నాడని నేను గ్రహిం చాను. కాని, దాసీతో 'ఏమో, నాకేమీ తెలియదే' అని అన్నాను.

రాత్రిబాగా ప్రొద్దుపోయిన తరువాత ఆయన నాగది లోకివచ్చారు. 'ఒకరోగిని చూడటానికి చాలా దూరగ్రామం వెళ్తున్నాను. తెల్లవారుజామున బయలుదేరు తున్నాను. రెండుమూడు రోజులవరకు రాలేకపోవచ్చును' అని చెప్పారు నాతో.

నేను మంచంమీదనుంచి లేచి నిలబడి 'నాతో అబద్ధాలు చెపుతారెందుకు?' అని అడిగాను.

ఆయన తడబడుతూ 'నేనేమి అబద్ధంచెప్పాను' అన్నారు.

'పెళ్ళిచేసుకోటానికి వెళ్తున్నారుగదూ?' అన్నాను నేను

ఆయన నోరు మెదపలేదు, ఆ తరువాత నేనూ ఏమీ అనలేదు. కాస్సేపటికి నేనే 'సమాధానం చెప్పవచ్చుగదా? నిజమే, పెళ్ళిచేసుకోటానికే వెళ్తున్నాను అని చెప్పరాదా?' అన్నాను.

దానికి ప్రతిధ్వనిగా ఆయననోటివెంట 'అవును, నేను పెళ్లిచేసుకోవటానికే వెళ్తున్నాను' అని వచ్చింది.

'వీల్లేదు, మీరు వెళ్ళటానికి వీల్లేదు. మీరు పెళ్లిచేసుకోకూడదు. ఆ మహాపాతకంనుంచి, ఆ విపత్తునుంచి నేను మిమ్మల్ని రక్షిస్తాను. ఆమాత్రంకూడా చేయలేనప్పుడు నేను మీకు భార్యనై వుండి ఏమిలాభం? ఇంతకాలంనేను శివపూజ చేసిన ప్రయోజనం ఏముంది?' అని అన్నానునేను.

కాస్సేపటివరకు మళ్ళీ ఇద్దరమూ మౌనంగా వుండిపోయాం. ఆ తరువాత మళ్ళీనేనే 'నేను మీకు ఏమి అపకారం చేశాను? నేనుచేసిన అపరాధం ఏమిటి? మీకు మరో భార్య ఎందుకు అవసరమయింది? నిజంచెప్పండి.' అనిఅడిగాను.

'అయితే నిజం చెప్తాను విను' అంటూ నెమ్మదిగా అన్నారాయన—'నువ్వంటే నాకేదో భయంపర్పడింది. నీగుడ్డితనం ఒక అంతులేని ఆవరణగా నీచుట్టూ వ్యాపించి నిన్ను కప్పేసింది. ఆ ఆవరణను ఛేదించి లోనికి వచ్చే మార్గంలేదు నీవు నాదేవతవు, భయానకమైన దానవు, అటువంటి దేవతతో నేను గృహకృత్యాలెలా చేయించగల్గుతాను? నేను చివాట్లు పెట్టగలగాలి, తిట్టగలగాలి, కోప

గించుకోవాలి, ముద్దు చేయగలగాలి, ముస్తాబుచేయు గలగాలి అటువంటి సామాన్య గృహిణి కావాలినాకు.'

'నాహృదయం చీల్చిచూడు. నేను సామాన్య గృహిణినే, నామనస్సు చూస్తే నేను నూత్నవధువునే కాని మరేమీ కాను అని మీకు అర్థమవుతుంది. మిమ్మల్ని నమ్మి, మిమ్మల్ని ఆశ్రయించుకొని మీపూజచేస్తూ వుండాలనే నా కోర్కె. అటువంటిది మిమ్మల్ని మీరు కించపర్చుకొని, నన్ను పెద్దచేసి నన్ను దుర్భరదుఃఖంలో పడద్రోయకండి. సమస్త విషయాలలో నన్ను మీపాదాలచెంతవుంచుకోండి.'

అప్పుడు నేనింకా ఏమేమిమాట్లాడానో నాకేపూర్తిగా గుర్తులేదు అల్లకల్లోలమై పోయివున్న సముద్రానికి తన గర్జన ఏమాత్రం వినబడుతుంది? నేను అన్నమాటల్లో ఒకమాటమాత్రం గుర్తుంది – నేను పుణ్యస్త్రీనే అయితే మీరు శపథభంగంచేయరు – అటువంటి పాపకార్యం జరిగేముందు నేనైనా వితంతువునౌతాను లేదా హేమాంగిని అయినా మరణిస్తుంది – నేనీమాట భగవంతుని సాక్షిగా చెపుతున్నాను' ఆమాట అంటూ నేను మూర్ఛబోయాను.

నాకు తెలివివచ్చి చూచుసరికి ఆయన వెళ్లిపోయారు, అప్పటికింకా కోడికూయలేదు.

నేను దేవతార్చన గదిలోకివెళ్లి తలుపులన్నీ వేసి పూజలో కూర్చున్నాను.

ఆరోజంతా బయటకు కూడారాలేదు, పూజలోనే కూర్చొని వుండిపోయాను. సాయంత్రమయేసరికి భయంకర

మైనగాలి వాన ప్రారంభమయాయి. ఇల్లుకూలిపోతుందేమో-ననిపించింది. నదిలో ప్రయాణం చేస్తూవున్న నాభర్తను రక్షించమని నేను ప్రార్థనచేయలేదు. నాఅదృష్టం ఏవిధంగా వున్నప్పటికీ ఆయన చేయబోతూవున్న మహాపాతకాన్నుంచి నాభర్తను కాపాడమని మాత్రం ప్రార్థించాను. ఆరాత్రంతా కూడా ఆవిధంగానే గడిచిపోయింది. ఆమరునాడుకూడా నేను కూర్చున్నచోటునుంచి కదల్లేదు – నిద్రాహారాలుమాని ఆవిధంగా ఎలావుండగలిగానో నాకే తెలియదు. ఆదేవుని విగ్రహంముందు నేనూ ఒక శిలావిగ్రహంవలె కూర్చుండి పోయాను.

సాయంత్రమయింది. తలుపుకొట్టారు బయటినుంచి. ఎంతబాదినా సమాధానంలేదు. తలుపులు విరగ్గొట్టారు – లోపల నేనుస్పృహతప్పి పడిపోయి వున్నాను.

నాకు తెలివివచ్చినప్పుడు 'అక్కా' అనేమాట విన్పించింది. నాతల హేమాంగిని ఒడిలోవున్నట్లు గ్రహించాను. ఆమె ధరించిన కొత్తచీర బరబరలాడింది. 'పరమేశ్వరా! అయితే, నామొర ఆలకించలేదా! నాభర్త పతనమై పోయారా!

హేమాంగిని నెమ్మదిగా తలవంచి 'అక్కా! నీ ఆశీర్వాదంకోసం వచ్చాను' అనిఅంది. ఆమాట వినగానే నా శరీరం కొయ్యబారిపోయింది. కాని మరుక్షణంలోనే లేచి కూర్చొని 'ఎందుకు ఆశీర్వదించను, నువ్వుచేసిన తప్పేముంది చెల్లీ!' అన్నాను.

హేమాంగిని బిగ్గరగానవ్వి తనమధురమైన కంఠంతో 'ఇందులో అపరాధం ఏముంది - నువ్వు పెళ్లాడితే అపరాధం లేదుకాని నేను పెళ్లాడితే అపరాధమా?' అని అంది.

హేమాంగినిని కౌగలించుకొని మనసారనవ్వి నాలో నేనే ఇలాఅనుకొన్నాను - అన్నింటికంటె నాప్రార్థనే గొప్ప పాపం? ఆయనకోర్కె మాత్రం ఫలించకూడదా? పరమేశ్వరా, ఆ ఆపదవద్దో నానెత్తినే పడనివ్వు. నానమ్మకమూ, నావిశ్వాసమూ ఉన్న నాహృదయ ప్రదేశంలోకి దేనినీ రానివ్వను. ఇంతకాలం వున్నట్టుగానే నేను ఎల్లప్పుడూ వుంటాను.

హేమాంగిని నాకునమస్కరించి పాదధూళి తీసుకొంది. 'చిర సౌభాగ్యవతీభవ, చిరసుఖీభవ!' అని ఆమెను ఆశీర్వదించాను.

'నన్నొక్కదానినే ఆశీర్వదించటం కాదక్కా, నీచెల్లెలి భర్తను కూడా దీవించాలి. నీ అనుజ్ఞఅయితే వారిని నీ దగ్గరకు తీసుకువస్తాను' అంది హేమాంగిని.

తీసుకు రమ్మని చెప్పాను నేను.

కాస్సేపటిలో కొత్త అడుగుల శబ్దం విన్పించింది గదిలో. 'కుముదా, కుశలమేనా?' అని ఎంతో ఆదరంగా విన్పించింది ప్రశ్న.

నేనుకంగారుపడుతూలేచి 'అన్నయ్యా' అంటూ మా అన్నయ్యకు నమస్కరించి అతని పాదధూళి తీసుకొన్నాను.

'అక్కా, అన్నయ్యా అంటావేమిటి? అతను నీచెల్లెలి భర్త. నువ్వతని చెవులు నులపాలి' అని అంది హేమాంగిని.

అప్పుడు నాకు అంతా అర్థమయింది. అన్నయ్య వివాహమాడనని ప్రతిజ్ఞ చేశాడు. అమ్మ లేదు; అతనిని పెళ్లాడమని వత్తిడిచేసే వారెవరూ లేరు. ఇప్పుడు నేనే అన్నయ్యకు పెళ్లి చేశాను. ఎంత ప్రయత్నించినా నాకన్నీరు ఆగలేదు. అన్నయ్య మృదువుగా నాతలనిమురుతూ వున్నాడు. హేమాంగిని నన్ను పట్టుకొని పకపక నవ్వసాగింది.

ఆరాత్రి నాకు నిద్రేలేదు. నాభర్త ఎప్పుడు తిరిగి వస్తారా అని ఎంతో ఆతురతగా ఎదురు చూస్తున్నాను. ఆయన ఈసిగ్గు, ఆశాభంగాన్ని ఎలా భరించగలరో వూహించలేక పోయాను.

రాత్రి రెండుజాముల సమయం నాగదితలుపులు తెరుచుకున్న శబ్దం విన్పించింది. నేను త్రుళ్లి పడిలేచి మంచం మీద కూర్చున్నాను. నాగుండె తీవ్రంగా కొట్టుకోసాగింది.

ఆయనమెల్లగావచ్చి నామంచంమీద కూర్చున్నారు. నాచేతిని తనచేతుల్లోకి తీసుకొని 'మీఅన్నయ్య నన్ను కాపాడాడు' అనిఅన్నారు – 'క్షణికమైన మోహంలోపడి నేను చావటానికి సిద్ధపడ్డాను. ఆరాత్రి ఎలా గుండెరాయిచేసుకొని పడవ ఎక్కగలిగానో నాకే తెలియదు. తుపానులో చిక్కుకొని చనిపోతానేమోఅని భయపడ్డాను. కాని ఆవిధంగా మరణించటం న్నామంచికే అనుకొన్నాను. మధురగంజ్ వరకు వెళ్ళాను – ఆ క్రితంరాత్రే మీ అన్నయ్యకు హేమాంగి నిచ్చి పెళ్ళిచేశారని ఎవరో చెప్పగావిన్నాను పడవ వెనక్కి తిప్పించాను – నాకు ఎంతసిగ్గువేసిందో, ఎంత ఆనందం కల్గిందో మాటలతో చెప్పలేను. నాఆనందానికి అంతులేదు.

నేను నిన్నువదలి సుఖం అనుభవించలేననీ, నువ్వు నా దేవత వనీ ఈ రెండు రోజుల్లోనూ స్పష్టంగా గ్రహించగలిగాను.'

'దేవతను అవాలనే కోర్కె నాకులేదు. నేను దేవతను కాదు—నేను సామాన్య స్త్రీని, నీ గృహిణిని' అన్నాను నేను నవ్వుతూ.

'నువ్వు నాకోర్కె నొకదానిని తప్పక మన్నించాలి. ఇంకెన్నటూ నన్ను దేవతఅంటూ నాకుసిగ్గు తెప్పించకూడదు' అన్నారు నాభర్త.

అమరునాథు అమితోత్సాహంతో, శంఖారావంతో మాపేటలో గొప్పసందడి చేశారు. ఆవాళ హేమాంగిని నాభర్తదగ్గరనే కూర్చొని రోజంతా ఏదో మాట్లాడుతూ హాస్య వినోదాలతో ఆయనను విసిగించి, వేధించి తనకక్షు తీర్చుకొంది. కాని నాభర్త ఎక్కడకు వెళ్ళాడు, అక్కడ ఏమి జరిగింది అని ఎవ్వరూ ఒక్క ప్రశ్నకూడా అడగలేదు.

# పరాజయం

బొమ్మలకూ తోకకూలేదా రాహు కేతువులకుగానీ జగడం వచ్చినప్పుడు జరిగేదేమిటో ఈవిషయంలో కూడా సరిగ్గా అలాగే జరిగింది. ప్రాచీనహాల్దారువంశం రెండు భాగాలుగా విభక్తమైపోయింది. ఇంతకాలం వారువుంటూ వచ్చిన విశాలభవనం మధ్య ఎత్తయిన గోడ ఒకటిలేచింది. ఒకరి ముఖాలు ఒకరుచూచుకోవటం లేదిక.

నవగోపాల్ కుమారుడు నళిన్, నవనీతలాల్ కుమారుడు నందలాల్ ఒకేవంశములోనివాళ్ళు, ఇద్దరిదీ ఒకే

వయస్సు, ఒకే స్కూలులో చదువుతున్నారు. కుటుంబ కల హోలు, ఈర్ష్యాద్వేషాలలో కూడా ఇద్దరూ సరిసమానులే.

నళిన్ తండ్రి నవగోపాలుడు చాలాకఠిన స్వభావంగల మనిషి. కుర్రాడిని క్షణమైనా విశ్రాంతిగా వుండనిచ్చేవాడు కాదు. చదవటం, వ్రాయటం తప్ప మరోపనిజోలికి రానిచ్చే వాడేకాదు. ఆటపాటల్లోనూ, తిండితిప్పల్లోనూ, ముస్తాబు విషయాల్లోనూ పిల్లవాడికుండే కోర్కెల్ని అతను స్కూలు పుస్తకాలక్రింద అణచిపెట్టేవాడు.

నందలాల్ తండ్రి నవనీతలాల్ శాసన పద్ధతులు అతి సులభంగా వుండేవి. తల్లికూడా పిల్లాడినెంతో గారాబంగా చూచేది. వారతనిని దొరబాబువలె ముస్తాబుచేసి స్కూలుకు పంపేవారు ఫలహారంకోసం రెండుమూడణాలు డబ్బులు కూడా ఇచ్చిపంపేవారు. నందలాల్ ఆడబ్బులతో ఐస్‌క్రీం, ఆవడలు, గాలిపటాలు వగైరా కొంటూ వాటిని పిల్లలకు పంచిపెడుతూ వుండేవాడు ఈవిధంగా అతడు స్కూలులో చాలా ప్రసిద్ధిచెందాడు. పాపం, నళిన్ లోలోపలే ఓటమి నంగీకరించి నందూతండ్రి మాతండ్రిఅయి, మాతండ్రి నందూతండ్రి అయితే, నందూకు అప్పుడు మజా చూపి స్తాను' అని అనుకొంటూ వుండేవాడు.

కాని, అటువంటి అవకాశం రాకముందే, అటు నంద లాల్ ప్రతిసంవత్సరము బహుమానాలు పొందుతూవచ్చాడు. ఇటు నళిన్ వట్టిచేతుల్తో ఇంటికి తిరిగివచ్చి స్కూలును నడిపే వాళ్ళ పక్షపాతబుద్ధిని గురించి నిందించేవాడు. తండ్రిఅతనిని మరోస్కూలులో చేర్పించాడు. ఇంటివద్దకూడా మరొక మాష్టర్ని నియమించారు; నిద్రపోయే సమయంలో ఒకగంట

తగ్గించి చదువుకునేసమయానికి కలిపాగు. అయినప్పటికీ పరిస్థితిలో ఏమీమార్పురాలేదు. నందలాల్ ప్యాసవుతూ అవుతూ బి. ఎ వరకు నెగ్గాడు. నళిన్ తప్పుతూ తప్పుతూ బోనులో చిక్కిన ఎలుకవలె ఎంట్రెన్స్‌లోనే ఆగిపోయాడు.

ఇంతలో, అతనితండ్రి అతనిమీద దయదలచి దేహయాత్ర చాలించాడు. మూడు సంవత్సరాలు వరసగాబంధించబడిన నళిన్‌కు విముక్తిదొరికింది. అప్పుడిక అతను సర్వస్వతంత్రుడై వేళ్ళకు ఉంగరాలు, చేతికి బంగారుగొలుసు గడియారం, చొక్కాకు బంగారుగుండీలు మొదలగునవి మెరిపించుకొంటూ నందలాల్‌ను పూర్తిగా నిస్తేజం చేసివేయటానికి ప్రయత్నం చేయసాగాడు. ఎంట్రెన్సు తప్పిన ఈరెండుజతల గుర్రాలబండి, బి. ఎ. పాసయిన ఒంటిగుర్రబ్బండీని అనాయాసంగా తప్పించుకొని ముందుకు సాగిపోసాగింది; విశ్వవిద్యాలయపు బిరుదుధారి ఆగుర్రాల నడకను అందుకోలేక పోయింది.

ఒకప్రక్క నళిన్‌కూ, నందలాల్‌కూ వివాహప్రయత్నాలు జరుగుతున్నాయి. అమ్మాయిలకోసం గాలింపు ప్రారంభమైంది. తాను వివాహమాడే అమ్మాయి సర్వగుణ సౌందర్యవతియై ఆమెకు ఆమేసాటిఅనిపించేదై వుండాలని నళిన్ శపథంచేశాడు; అంటే తన బండీకుండా, తనభార్య ముందూకూడా నందలాల్ పరాజయం తప్పక పొందాలి.

చివరికి, రావల్పిండిలో ఒక బెంగాలీ కుటుంబం వుంటోందనీ, వారికొక అపురూపసౌందర్యవతియైన కుమార్తె వుందనీ తెలియవచ్చింది. దగ్గరలోవున్న సౌందర్యవతికంటె దూరానవున్న సౌందర్యవతి అంటే ఆకాంక్ష అధికమౌతుంది

కొంత. నళిన్ ఉన్మత్తుడై పోయాడు. ఖర్చులన్నీ తానేభరించి అమ్మాయిని కలకత్తా పిలిపించారు. అమ్మాయి అందమైన దనటంలో ఏమీ సందేహంలేదు.' ఎవరు ఎన్నితంటాలు పడ్డా రావల్సింది అమ్మాయినిమించిన అమ్మాయిని తేవటం వాళ్ళతరంలో జరుగదు. ఇంతకుముందు ఈ అమ్మాయిని మేముచూచి నచ్చక వదిలేశాం అనేవాళ్ళయినా ఎవరూ వుండరనేది నిశ్చయం' అన్నాడు నళిన్.

శుభము పత్రాలూ ఒక ఆమోదానికి వచ్చినట్లేలెక్క. బట్టలు, నగలు ఎన్నికచేసే కార్యక్రమం సాగుతూవుంది. ఇంతలో ఒకనాటి ఉదయం నవనీతలాల్ ఇంటినుంచి విచిత్రమైన పళ్లెములతో వివిధకానుకలు తీసుకొని దాసదాసీజనం పెద్దలైనుగా బయలుదేరింది.

అదిచూచి నళిన్ 'అదేమిటో వెళ్లి చూచిరండి' అన్నాడు తనమిత్రబృందంతో.

నందలాల్‌కు కాబోయే పెళ్లికుమార్తెకోసం కానుకలు వెళుతూవున్నాయని తెలిసింది.

ఆమాట వినగానే నళిన్ త్రుళ్లిపడి హుక్కావదలి లేచి నిల్చున్నాడు. 'అయితే ఎవర్నయినా పంపి పూర్తి సమాచారం తెలుసుకోవాలి' అన్నాడు.

మరుక్షణమే దూతలు బయల్దేరారు. విపిన్‌హాజరా తిరిగివచ్చి 'పిల్లవారిది కలకత్తాఅట, పిల్లమాత్రం చాలా అందమైనది' అని చెప్పాడు.

నళిన్ నడుంవిరిగిపోయింది. 'నువ్వన్నదేమిటి?' అని అడిగాడు రెట్టిస్తూ.

'ఆమె అందాన్ని వర్ణించలేము' అన్నాడు విపిన్.

'అయితే, తప్పక చూచితీరాలి' అన్నాడు నళిన్.

వెంటనే మిగిలిన సభికులు 'అదేమంత ఘనకార్యం?' అంటూ చేతిలో డబ్బువుండాలిగాని అన్నట్లు సైగచేశారు.

అవకాశంవెంట నళిన్ అమ్మాయిని చూచాడు. ఆఅమ్మాయి నందలాల్‌కు స్థిరపడిపోయిందనే సంగతి ఆలోచించినకొద్దీ, అతనికి ఆమె రావల్పిండి అమ్మాయికంటే అందంగా కన్పించ సాగింది. సందిగ్ధంలోపడి కొట్టుకొంటున్న నళిన్ తనసభికులతో 'మీకెలావుంది?' అనిఅడిగాడు.

'మాకు చాలా బాగానే వుంది' అన్నాడు విపిన్.

'ఆమె బాగున్నదా లేక ఈమెబాగున్నదా?' అని అడిగాడు నళిన్. 'ఈమే బాగున్నది' అన్నాడు విపిన్.

అప్పుడిక నళిన్‌కు రావల్పిండి అమ్మాయి కళ్ళు ఈమె కళ్ళముందు ఎందుకూపనికిరావనీ, ఈమెశరీరం చాలా గౌరవర్ణమనీ, ఆమెకంటే ఈమెలో గుల్బాబివర్ణం అధికమనీ, ఈమెలో కళాకాంతులు అధికమనీ అనిపించసాగింది. ఈమెను వదులుకో పీలులేదు. నళిన్ దిగులుతో కూర్చొని రెండు మూడుసార్లు హుంకా పీల్చి 'ఏమోయ్ విపిన్, ఇప్పుడిక ఏమిచేయాలోచెప్పు' అని అడిగాడు.

'మహారాజా, ఇందులో అంతకష్టమేముంది?'అంటూ చేతిలో తడి వుండాలన్నట్లు సైగచేశాడు.

డబ్బు గలగలలాడే సరికి అసాధ్యం సాధ్యమై పూరుకొంది. పెళ్లికుమార్తె తండ్రి పెళ్లికుమారుని తండ్రితో చాలా విచిత్రమైన పేచీపెట్టుకొన్నాడు. పెళ్లికుమారుని తండ్రి 'మా అబ్బాయికి మీఅమ్మాయినిచేసుకొంటేనా ...' అంటూ అనేకమాటలు అన్నాడు.

పెళ్లికుమార్తె తండ్రికూడాఅంతకుమించినతీవ్రతతోనే 'మీ అబ్బాయికి మాఅమ్మాయినిఇచ్చిచేస్తే-' అనిఅన్నాడు.

ఆ తరువాత, మరేమీ ఆలస్యం కాకుండానే నంద లాల్‌ను తోసిరాజని శుభలగ్నాన శుభవివాహం ఏర్పాట్లు తొందరగా జరిగిపోయాయి. అప్పుడు నవ్వుతూ 'ఏమోయ్‌విపిన్, బి. ఎ ప్యాసయిన అతను జయించాడా, లేక ఈ భార్యా ప్యాసయినవాడా? చివరి పరీక్షలో అయ్యగారు పరాజయమే పొందారుగదా!' అని అన్నాడు.

మరి కొద్దిరోజులకే నవనీతలాల్ ఇంట్లో ఒకనాడు సన్నాయి విన్పించింది. నందలాల్ వివాహం ఆనాడు.

నళిన్ విపిన్‌తో 'ఆ అమ్మాయి ఎలాంటిదో కొంచెం తెలుసుకో' అని చెప్పాడు.

'అమ్మాయి అదే ఆ రావల్పిండి అమ్మాయే' అని వార్త మోసుకొచ్చాడు విపిన్.

'భలే భలే! రావల్పిండి అమ్మాయేనా!' అంటూ నళిన్ పొట్టచెక్కలయ్యేట్లు నవ్వుతూ' వాళ్ళకు మరెక్కడా అమ్మాయే దొరకలేదన్నమాట చివరకు మనం వదలివేసిన అమ్మాయినే చేసుకుంటున్నారన్నమాట' అన్నాడు. నళిన్ అన్నమాటనే పదే పదే అంటూ.

కాని ఆతరువాత నళిన్ నవ్వులో ఆజోరు కన్పించ లేదు. అతనినవ్వులో పురుగులుపడ్డాయి. ఒకచిన్న సందేహం తీవ్రస్వరంతో అతని చెవుల్లో మాటి మాటికి ప్రతిధ్వనించ సాగింది. 'అయ్యో, అయ్యో! చెయిజారిపోయింది! చివరకు ఆమె నందలాల్‌కే లభించింది 'అనే చిన్నసంశయంక్రమంగా రక్తంపీల్చిన జలగవలె ఉబ్బింది. దాని కంఠస్వరం మరింత

మోటుగా 'ఇకనువ్వే విధంగానూ పొందలేవు; నిజానికి ఆమే చాలాఅందమైనది-మోసపోయిందినువ్వే' అనివిన్పించసాగింది.

ఇప్పుడేమి జరగాలి?

ఆతరువాత నళిన్ అంతఃపురంలోకి భోజనానికి వెళ్లినప్పుడు తన భార్యయొక్క చిన్నచిన్న లోపాలు కూడా చాలా పెద్దవిగా కన్పించి అతనిని హేళన చేస్తూవుండేవి. తన భార్య తనను గొప్పమోసం చేసిందని అనిపించ సాగిందతనికి.

రావల్పిండిఅమ్మాయితోవివాహసంభాషణజరుగుతూవున్నప్పుడు ఆమెఫోటో ఒకటి వచ్చిందితనికి. దాని నిప్పుడు బయటకుతీసి పరిశీలనగా చూడసాగాడు - 'ఆహా! ఏమి సౌందర్యం! ఎంతమాధుర్యంవుందా మెముఖంలో! చేతికి అందిన అటువంటి లక్ష్మిని పోగొట్టుకున్న గాడిదను నేను' అని విచారించసాగాడు.

సాయంత్రం నవనీతలాల్ ఇంటినుంచి రంగురంగుల దీపాలతో బాజాభజంత్రీలతో నాలుగు గుర్రాలబండిలో వరయాత్ర బయ చేరింది.

కచేరీసావిట్లో పరుపుమీద కూర్చొనివున్న నళిన్ హుక్కాపీలుస్తూ ఏదోవిధంగా మనస్సును ఊరడించుకోవాలని వ్యర్థప్రయత్నం చేస్తున్నాడు. ఇంతలో నవ్వుతూ ప్రవేశించాడు విపిన్. నందలాల్‌ను ఎగతాళిచేస్తూ సభచేయాలని ప్రయత్నించసాగాడు.

'దర్వాన్!' అని పిలిచాడు నళిన్.

విపిన్ నవ్వుఆపి దర్వాన్‌ను పిలిచివచ్చాడు.

అప్పుడు, బాబుగారు [illegible] చూపిస్తూ 'వీడిని ఇలిటనే మెడపట్టిబయటకుగెంటు!' అని ఆజ్ఞాపించాడు.

